# వినయాశ్రమం

## ది 23-12- 1933 స్థాపన.

పూజ్య బాపూజీచే తెరువబడినది. గ్రామోద్ధరణకై కృషి చేయుచున్నది.

ఇప్పుడు సాగుచున్న శాఖలు.

(1) నవీన విద్య
(2) తిలక్ జాతీయ పాఠశాల.
(3) హిందూస్థానీ ప్రచారం.
(4) గ్రంథ ప్రచురణ.
(5) పత్రికా ప్రచురణ.
(6) అక్షరవిలాస్ ప్రెస్.
(7) అనాథ శరణాలయం.
(8) గో సంరక్షణ.
(9) ఖాదీ సరంజాం కార్యాలయం.
(10) సదావ్రత్తి.
(11) ఆయుర్వేద మానవ వైద్యం.
(12) ఆయుర్వేద పశు వైద్యం.
(13) ప్రకృతి చికిత్స.
(14) కస్తూరబా ప్రసూతి వైద్యశాల.
(15) హరిజన సేవ.
(16) విశ్వసందేశం వగైరా.

# గాంధీజీకి శ్రద్ధాంజలి



గ్రంథకర్త:
వినోబాజీ



అనువాదకుడు
వేమూరి రాధాకృష్ణమూర్తి

ప్రచురణ
వినయాశ్రమ గ్రంథమాల
వినయాశ్రమం (వయా) పొన్నూరు

# తొలి పలుకు

శ్రీ వినోబాజీ తత్త్వవేత్త, భాషావేత్త, సేవామహాత్త్వవేత్త, నిర్మాణకార్యక్రమ రహస్యవేత్త, సర్వోదయ శుభ సందేశ వేత్త. మూలములో ఉపనిషత్తులు, త్రిపీటకములు, బైబిలు, కురాన్, పఠించినవాడు.

విద్యాభ్యాసము సేయు బాల్యముననే మహాత్ముని మహామంత్రము శ్రవణానందము కలిగించ, కళాశాలను బహిష్కరించి, "తల్లివెంట తవులు లేగవలె" సబర్మతి ఆశ్రమం చేరి సేవాశాస్త్రములో ఉపదేశమొందె. మహాత్ముని అనుమతితో ఏడాదిపాటు కాశిలో వేదశాస్త్రముల నభ్యసించి నిర్ణీత ముహూర్తమునకు తిరిగివచ్చి గాంధీజీని దర్శించె.

నైష్ఠికబ్రహ్మచారి ఆయన. వివాహంమాట తలపెట్టక, తాను సోదరులిద్దరు ముగ్గురును గాంధీసేవలో నిమగ్నులైరి. గాంధీజీ ఆమోదముతో, జమ్నాలాల్‌జీ ఆహ్వానముపై వర్ధా చేరి సత్యాగ్రహాశ్రమము స్థాపించి గ్రామసేవామండలి నెలకొలిపి, వర్ధాప్రాంతమును పునీతమొనర్చి, వర్ధానదీ తటమున జమ్నాలాల్‌జీ భవనమున ఏకాంతవాసమున తపమొనర్చి, పవనారులో ఖాదీమాహాత్మ్యమును ఆర్థిక సమానత్వమును ప్రదర్శించెను.

"సఱుతత"గాంధీజీ సంకల్పించినదే చాలు, దానికి రూపురేఖలు కల్పించేది వినోబాజీ, ఆయన మూలవిరాట్టు; ఈయన హిరణ్యగర్భుడు. పూర్వం అర్జునుడు, పాశుపతాది దివ్యాస్త్ర ప్రయోగోప సంహారములో సవ్యసాచి; నేడో అహింసావతార

మూర్తి సృజించిన నిరుపమాన శస్త్రాస్త్ర ప్రయోగాదులలో నూతన సవ్యసాచి వినోబా.

మహాముని; కాననే రాజ్యాంగ ప్రచార లోకమునకు అపరిచితుడు. అయినా వ్యక్తి సత్యాగ్రహము ౧౯౪౦ లో ఆరంభించిన శుభసమయమున, అజ్ఞాత సముద్రగర్భమున పొదిగి మెరుగుపెట్టి దాచి యుంచిన యీ మాణిక్యమును గాంధీజీ వెల్వరించి లోకాని కాశ్చర్యము గొలిపె.

గాంధీజీ నిర్వాణపద మారోహించిన దినములలో తన కాంతిపుంజమును ప్రసరింపచేసి, అనుచరబృందము నావరించిన దుఃఖోపశమనము చేయుటకు ఉపదేశించిన భావాలు వ్యాఖ్యానించిన వాక్యాలు ఈ చిన్న గ్రంథమున భద్రపరచబడినవి. కాననే గాంధీజీకి శ్రద్ధాంజలీ అని దీనిపేరు. ఈ జ్ఞాని తన గురువునకు అర్పించిన జ్ఞానమయ తర్పణము; అనుపమాన యజ్ఞము ఇది.

హిందూస్థానీలో ప్రవచించిన వాక్కులను ఆంధ్రములోనికి మా స్నేహితుడు శ్రీ వేమూరి రాధాకృష్ణమూర్తిగారు సులభశైలిలో అనువదించిరి.

వినోబాజీ రచియించిన గ్రంథాలన్నిటిని ఆంధ్రానువాదములో ఆంధ్రదేశాన ప్రకటించే భాగ్యమును వినయాశ్రమమునకు అనుగ్రహించె. ఇది అందులోని మొదటి పువ్వు. ఆంధ్ర పాఠకలోకం దీని సౌరభము నాఘ్రాణించి, జ్ఞానసంభరితులగుదురని ఆశించెద.

ఆంధ్రుల కానందము ఆకాంక్షించు వినయాశ్రమం సీతారాం.

ఫాల్గుణ శుద్ధ తదియ బుధవారం. హూ. శ. ౩-౩-౪౮ గాం. శ. ౧౫-౨-౩

ఓమ్

౧

నా ప్రియమైన సోదర సోదరీమణులారా!

ఇప్పుడే, ఈసమయమందే, ఢిల్లీలో యమునానదిఒడ్డున ఒక మహాపురుషుని దేహము అగ్నిలో దహనమవుతూ ఉంది. మనము ఇప్పుడు, ఇక్కడ ప్రార్థనచేస్తూ ఉన్నట్లు, భారతదేశ మందంతటా, ప్రార్థన జరుగుతూఉంది. నిన్నటిరోజున సాయంత్రం ఐదుగంటలయింది. ప్రార్థనకు సమయమైంది. గాంధీజీ ప్రార్థనకు బయలుదేరారు. ప్రార్థనకు ప్రజలంతా పోగయ్యారు. గాంధీజీ ప్రార్థనాస్థలానికి చేరగానే, ఒకయువకుడు ముందుకు వచ్చి గాంధీజీ శరీరంమీద గుండ్లు పేల్చాడు. గాంధీజీశరీరం వాలి పోయింది. రక్తం ప్రవహించ సాగింది. 20 నిముషాలతర్వాత జీవితం సమాప్తం అయిపోయింది. కొద్దిసమయంక్రితమే సర్దార్ వల్లభ్ భాయిపటేలు ఒకగంటవఱకు, గాంధీజీతో మాట్లాడి ఇంటికి మరలిపోతూఉన్నారు. త్రోవలోనే వారికి ఈవార్త తెలిసింది. వారు తిరిగివచ్చారు. బిర్లాభవనానికి చేరినప్పుడు, వారుచూచిన దృశ్యాన్ని వర్ణిస్తూ వారు నిన్న రేడియోలో ప్రసంగించారు. ఆ ప్రసంగం మీలో చాలామంది వినేఉంటారు. కాని ఇక్కడ, ఇప్పుడు, చాలామంది గ్రామప్రజలు వచ్చిఉన్నారు. వారు ఆప్రసంగం వినియుండరు, సర్దార్ వల్లభ్ భాయిపటేల్ ఒకమహత్తరమైనవిషయంచెప్పారు. "గాంధీజీ మొగంలో దయాభావం, మరియుక్షమాభావంగ, అనగా అపరాధియెడ క్షమాగుణం కనబడుతూఉంది". ఇదే ఆ మహత్తరవిషయం,ఇప్పుడుఎంతదుఃఖం

కలిగినాసరే, కోపం దెచ్చుకోగూడదు. కోపంవచ్చినా దానిని ఆపు కోవాలి. "గాంధీజీ మనకు నేర్పినపాఠంను ఆయనబ్రతికిఉండగా మనం అమలుజరుపలేకపోయాం. కాని యిప్పుడు ఆయన చని పోయినతరువాతనైనా అమలుచేదాం" అనికూడా వల్లభ్ భాయి తరువాత చెప్పియున్నారు.

ఇలాంటి ఘట్టమే, ఐదు వేల సంవత్సరాలక్రితం, హిందూ దేశంలో జరిగింది. శ్రీకృష్ణభగవానుడు వృద్ధుడై పోయాడు. జీవిత మంతా ప్రయత్నంజేసి అలసిపోయాడు. గాంధీజీవలెనే, కృష్ణ భగవానుడుకూడా ప్రజాసేవజేశాడు. అలసిపోయి ఒకపర్యాయం అడవిలో ఒక చెట్టుక్రింద విశ్రమించాడు, ఇంతలో ఒక వేటగాడు ఆ అడవిలోకి చేరాడు. ఏదోలేడి, చెట్టుక్రింద ఉన్నదని, భ్రమ పడ్డాడు. అసలు వేటగాడుగదా? అతడు గురిజూచి బాణం వది లాడు. బాణం శ్రీకృష్ణునిపాదానికి తగిలింది. రక్తం ప్రవహించ సాగింది. వేటగాడు సంతోషంతో దగ్గరకు వచ్చాడు. బాణం గురితప్పనందుకు ఆనందపడ్డాడు. కాని దగ్గరికివచ్చిచూస్తే శ్రీ కృష్ణభగవానుడు గాయంతగిలి పడిఉన్నాడు. వాడికి చాలా దుఃఖంకలిగింది. తనచేతితో, చాలాపాపం జరిగిందని దుఃఖం చాడు. శ్రీ కృష్ణభగవానుడు కొద్దిసేపులోనే పరమపదించాడు. చనిపోయేముందు పరమాత్మ ఆ వేటగానితో ఇలా చెప్పాడు. "ఓ వ్యాధుడా! భయపడకు, మృత్యువుకు ఏదోకారణంవుండి తీరాలి. నా మృత్యువుకు నీవు నిమిత్తమాత్రుడవైనావు." ఇలా అని పరమాత్ముడు వేటగానిని ఆశీర్వదించాడు.

అదే విధమైన ఘట్టం, ఐదు వేల సంవత్సరాల తర్వాత మళ్ళీ జరిగింది. పైకిచూస్తే ఆ వేటగాడు అజ్ఞానంవల్ల, చూడక

బాణం వేసినట్లు తోస్తుంది. కాని ఇక్కడ, ఈ యువకుడో? బాగా ఆలోచించి, తెలిసిఉండే, గాంధీజీని బాగా గుర్తించియే, తుపాకి ప్రేల్చాడు. ఈ పనికోసమే, అతడు ఢిల్లీ వెళ్లాడు. అతడు ఢిల్లీ నివాసిగాడు. గాంధీజీ ప్రార్థనకు వెళుతూఉండగా, అతడు గాంధీజీని సమీపించాడు. బాగా దగ్గరకువెళ్లి గుండ్లు వదిలాడు. పైకి చూస్తే ఈ యువకుడు గాంధీజీని బాగా ఎరుగుననే తోస్తుంది. కాని ఈ యువకుడుకూడా అజ్ఞానుడే. గాంధీజీ హిందూమతానికి హాని చేకూరుస్తూఉన్నారని అతడు భావించాడు. అందువల్లే గుండ్లు వదిలాడు. కాని నిజంగా చూస్తే నేడు ప్రపంచం మొత్తంలో, హిందూ ధర్మజ్యోతి ఆరిపోకుండా, దేదీప్యమానంచేసిన వ్యక్తి ఎవరైనా ఉంటే, ఆయన ఒక్క గాంధీజీయే. మొన్న ఆవిషయం గాంధీజీ స్వయంగానే ఇట్లుచెప్పారు. "హిందూధర్మాన్ని రక్షించేందుకు, ఒక వ్యక్తిని పంపాలి, అనే తలంపు అవసరం పరమాత్మునికి కలిగితే, ఆయన తప్పక నన్నే పంపుతారు." ఇంత ఆత్మవిశ్వాసం గాంధీజీకి ఉంది. ఏది నిజమని తోస్తుందో, — దానిని తిన్నగా, ముక్కుకు సూటిగా, ధైర్యంగా చెప్పివేయడం వారికి అలవాటు. గొప్పవారు తమ ప్రాణరక్షణార్థం, బాడీ గార్డులు అనగా శరీరరక్షకులను పెట్టుకుంటారు. కాని గాంధీజీ ఈవిధంగా ఎప్పుడూ శరీరరక్షకుల్ని నియమించుకో లేదు. శరీరాన్ని తుచ్ఛవస్తువుగా వారు భావించారు. నిర్భయత్వం ఆయన వ్రతం. పెద్దపెద్ద సైన్యాలు సైతం పోవడానికి సాహసించని చోట్లకుకూడా, ఒంటరిగా వెళ్లడానికి సిద్ధంగావుండేవారు గాంధీజీ.

"ఏదిసత్యమో, ప్రజలకు క్షేమకరమో, దానిని చెప్పి తీరవలసిందే. కొందరికి చెడుగా తోచినాసరే, మంచిగా తోచినా సరే, పరిణామం ఏమయినాసరే, సందేహించకూడదు." ఇది వారి ప్రవృత్తి. "మృత్యువువల్ల భయపడవలసిన అవసరం ఎంత మాత్రం లేదు. ఎందువల్లననగా. మనమంతా ఈశ్వరునిచేతిలో ఉన్నాం. మనంచేయవలసిన సేవఅంతా చేసేందుకు, కావలసిన సమయం, పరమాత్ముడు మనకు ఇస్తాడు. మనపనిపూర్తికాగానే పరమాత్ముడు మనల్ని తనవద్దకు పిలుస్తాడు.అందువలన నిజమని తోచిన విషయాన్ని మనం చెప్పివేయవలసిందే. ఇలాంటి పరిస్థితిలో నేనుఒంటరిగావుండిపోయినాసరే, ప్రపంచమంతా నాకు వ్యతిరేకం అయినాసరే, నాకు నిజమనితోచిన విషయం నేను చెప్పవలసిందే." ఇదే విధమైన నిర్భయగుణంతో జీవితం గడిపారు గాంధీజీ. వారి మృత్యువుకూడా ఏ పరిస్థితుల్లో జరిగింది? వారు ప్రార్థనపర్పాటులో ఉన్నారు. అనగా ఆ సమయమందు వారి మనస్సులో పరమాత్ముడుతప్ప, ఇంకొకవిధమైన ఆలోచన లేనేలేదు. వారి జీవితమంతా సేవామయంగాను, పరోపకారమయంగాను గడచింది. అయినమా ప్రార్థనాభావం, ప్రార్థనా సమయం, చాలా పవిత్రమైనవి. అనేక మహత్తరమైన రాజకీయపనుల్లో వారు మునిగిఉంటూ ఉండేవారు. కాని వారి ప్రార్థనాసమయంమాత్రం ఎన్నడూ తొలగలేదు. ఇలాంటి ప్రార్థనాసమయంలో, దేహయాత్ర ముగింపజేయుటకో యన్నట్లు పరమాత్ముడు తన దూతనుపంపాడు. తనపని తానుచేస్తూఉన్న సమయంలో, మృత్యువాత పడటంవల్ల వారిమనస్సుకు కలిగిన ఆనందం, నిమిత్తమాత్రుడగు ఆ దోషినిగుణించిన దయాభావం,

ఈ రెండుభావాలు, గాంధీజీమొగంమీద తోణికిసలాడుతూ ఉన్నట్లు పటేలుకు కనబడినదట.

గాంధీజీ ఉపవాసం విరమించినప్పుడు కాంగ్రెసువాదులు, ముసల్మానులు, సిక్కులు, హిందూమహాసభవారు, రాష్ట్రీయ స్వయంసేవకసంఘసభ్యులు, మొదలైనవారంతా దేశంలో శాంతిని పునస్థాపన చేస్తామని ప్రమాణంచేశారు. మేమంతా ప్రేమతో కలసిమెలసిఉంటామని మాటఇచ్చారు. ప్రజలు ఆ విధంగా ఉండసాగిరికూడా. కాని ఇంతలో ఒకరోజున ప్రార్థన సభలో, గాంధీజీని లక్ష్యముజేసి ఎవరో అగ్నిగోళం విసిరారు. అది గాంధీజీకి తగలలేదు. ఆరోజు ప్రార్థనలో గాంధీజీ ఇట్లు చెప్పారు. "నేను దేశానికీ, ధర్మానికీ భగవంతుని ప్రేరణవల్లనే సేవజేస్తూఉన్నాను. ఏరోజున నేను వెళ్లిపోవడం భగవంతునికి ఇష్టమో ఆరోజున భగవంతుడు నన్ను తానే తీసుకొనివెళ్లి పోతాడు. అందువలన మృత్యువునుగురించి విశేషం నాకేమీ తోచడంలేదు." రెండవప్రయోగం నిన్నజరిగింది. భగవంతుడు ఈసారి గాంధీజీని ముక్తుని జేశాడు.

మనమంతా దేహంవదిలి వెళ్లిపోయేవారమే. అందువల్ల మృత్యువునుగురించి కొంచెంకూడా దుఃఖించవలసిన కారణం లేదు. తల్లి తనఇద్దరు, ముగ్గురు బిడ్డల్ని ఏభావంలో చూచు కుంటుందో, ఆ భావంతో గాంధీజీ ప్రపంచాన్నంతటినీ చూచే వారు. హిందువులు, ముస్లిములు, హరిజనులు, క్రైస్తవులు వీరేగాక తాను యుద్ధంజేసిన, దేశపరిపాలకులగు ఇంగ్లీషు వారినిసైతం, అందరినీ సమానంగా ప్రేమించారు. "సజ్జనులను ప్రేమించినంతగా, దుర్జనులను గూడా శత్రువులను గూడా

ప్రేమించు. ప్రేమతో వాళ్ళహృదయాల్ని జయించు." ఈ మంత్రమే వారు అందరికీ ఉపదేశించారు. వారే మనకు సత్యాగ్రహం నేర్పారు. "నీవే కష్టాలూ, బాధలూ సహించు, ఎదుటివారికి ఏమీ కష్టం కలిగింపకు. తద్వారా జయంపొందు" ఈ శిక్షణ మనకు నేర్పింది గాంధీజీయే ఇలాంటి మహాపురుషుడు భౌతికదేహం వదలి వెళ్ళినంతమాత్రాన, ఏడ్వవలసినవిషయం అందులో ఎంతమాత్రం లేదు. మనల్ని కన్నతల్లి, మనల్ని వదలి, దేహం చాలించి వెళ్ళితే, ఎంతబాధ కలుగుతుందో, గాంధీజీ మనల్ని వదలివెళ్ళితే, అంతేబాధ మనకు కలిగితీరుతుంది, తప్పదు. కాని అంతమాత్రంచేత మనం దుఃఖపడకూడదు. నిరాశపడకూడదు.

"చనిపోయినగురువు, ఏడుస్తూవున్న శిష్యుడు ఈ ఇద్దరి జ్ఞానం — కష్టపడి సంపాదించిన జ్ఞానమంతా — వ్యర్థమే" మృత్యువువల్ల భయపడుతూఉండే ఒకగురువు ఉంటూఉండేవాడు, చనిపోయే సమయంలో "అరే! నేను చనిపోతూ ఉన్నాను"అని కేకలువేయడం ప్రారంభించాడు. అదివిని అతని శిష్యులంతా ఏడ్వడం ప్రారంభించారు. ఈవిధంగా చనిపోయిన గురువు, ఏడుస్తూఉన్న శిష్యులూ, ఇద్దరుకూడా. పొందిన జ్ఞానం వ్యర్థమైపోయిందని ఏక్‌నాథ్ మహారాజ్ భాగవతంలో చెప్పారు.

గాంధీజీ మృత్యువును జూచి భయపడిపోయేగురువు కాదు. "నిష్కామభావంతో శరీరాన్ని, లయంచేసి,—చేసిన సేవే భగవంతుని సేవ. ఆవిధమైన సేవజేస్తూ పరమాత్ముడు పిలిచినరోజున వెళ్ళిపోయేందుకు సిద్ధంగాఉండు."అనేపాఠంగాంధీజీ మనకు నేర్పారు. అదేవిధంగా వారికి మరణం సంప్రాప్తమైంది.

అందువలన ఇది "ఉత్తమమైన అంతం" అని మనం గుర్తించాలి. మన పనుల్లో మనం మగ్నం కావాలి.

కొద్దిరోజులక్రితమే ఆశ్రమంలోని కొందరు సోదరులు గాంధీజీని కలుసుకునేందుకు ఢిల్లీ వెళ్లారు. ఆ సమయంలో వారి ఉపవాసం జరుగుతూఉంది. ఉపవాసంలో వారు జీవించి ఉంటారో - లేక - చనిపోతారో, యెవరికి తెలుసు? "తాము ఈ ఉపవాసంలో చనిపోతే మేమేమిచేయాలి?" అని ఆశ్రమ సోదరులు గాంధీజీని ప్రశ్నించారు. "ఈవిధమైన ప్రశ్న అసలు మీలో ఎందుకు బయలుదేరింది. నేను మీకోసరం చాలినంత కార్యక్రమం ఏర్పరచానుగదా? హిందూదేశంలో ఖాదీపని చేయాలి. ఖాదీ శాస్త్రం తయారుచేయాలి. ఇంతపెద్దపనిఉంటే ఏంచేయాలి? అనేచింత మీకెందుకు కలగాలి?" అని గాంధీజీ తత్క్షణం జవాబు చెప్పారు.

అందువలన వారు మనకోసం వదలివెళ్ళిన కార్యక్రమం, మనం పూర్తిజేయాలి. అనేకజాతులు, సంఘాలు కలసి మనం ఇక్కడ ఉంటూఉన్నాం. నలుబదికోట్లజనాభా కలిగినదేశంలో మనం జన్మించడం, మనమహద్భాగ్యం, కాని ఒకర్ని ఇంకొకరు ప్రేమించుకొని, ఉండగలిగినప్పుడే ఆ మహద్భాగ్యం మనకు లభించుతుంది. ఇంతపెద్దదేశంలోపుట్టే అదృష్టం చాలా అరుదుగా లభిస్తూఉంటుంది. మనదేశంలో అనేకమతాలు, అనేక జాతులవారు ఉన్నారు. నేనుమాత్రం ఇది మనమహాభాగ్యం అనే అనుకుంటూ ఉంటాను. కాని మనమంతా ప్రేమతో కలసి మెలసి ఉన్నప్పుడే ఈ భాగ్యం మనకు ఫలిస్తుంది. "మనమంతా ప్రేమతో కలసిమెలసి ఉండవలసిందనే" తన అంతిమ ఉపవాసం

ద్వారా గాంధీజీ మనకు బోధించారు. పిల్లలు కలహించుకోకుండా అంతా కలసిమెలసి ప్రేమగా ఉండటంకోసం తల్లి ఏవిధంగా తాను ఉపవాసంచేస్తుందో అదేవిధంగా గాంధీజీకూడా ఉపవాసం చేశారు. 'మానవులంతా ఒక్కటే' అనేసిద్ధాంతంవారుమనకుబోధించారు. హరిజనసేవ, ఖాదీసేవ, గ్రామసేవ, పాకీవారిసేవ(భంగీసేవ) మొదలైన అనేకసేవాకార్యములుమనకోసం వారువదిలివెళ్ళారు.

ఇప్పుడు ఈ సమయంలో అధికంగా నే నేమీ చెప్ప గోరడంలేదు. అందరి హృదయాలూ ఒక విశేషభావంతో బరువుతో నిండి ఉన్నాయి. కాని శోకిస్తూకూర్చోవద్దనిమాత్రమే నేనుచెప్పగోరుతూ ఉన్నాను. మనఎదుటనున్నపనుల్లో మగ్నమైపోవాలని నాకోరిక. నేను మీకుచెపుతూఉన్నట్లే మీరునాకు కూడా చెప్పండి. ఈ విధంగా ఒకరికి ఇంకొకరు చెప్పుకుంటూ జ్ఞానోదయం కలిగించుకుంటూ మనమంతా గాంధీజీబోధించి వెళ్ళినకార్యక్రమంలో మగ్నమవుదాం. భక్తుడు—సజ్జనుడు—ఒకరికి ఇంకొకరు జ్ఞానోదయం కలిగించుతూఉంటారని ప్రేమతో కలసిమెలసి ఉంటారని భగవద్గీతలోను కురాన్‌లోను చెప్పబడి ఉంది, అదేవిధంగా మనంకూడా చేతాం. ఇప్పటివఱకు మన మంతా చిన్నపిల్లలలాగా పోట్లాడుకుంటూ ఉండేవారం. కాని గాంధీజీ మనల్నందరినీ సంబాళించుకుంటూ ఉండేవారు. ఆ విధంగా అందరినీ సంబాళించగల మహావ్యక్తి ఇప్పుడు లేడు. అందువలన ఒకరికి ఇంకొకరు బోధించుకుంటూ, ఒకరిని ఇంకొకరు ప్రేమించుకుంటూ, అందరం కలసి గాంధీజీనేర్పిన నీతి మార్గాన, శిక్షణమార్గాన నడుతాం.

(ప్రార్థనసభ పరంధామ్‌పవనార్ 31-1-48సమయం సా॥4½ గం॥)

౨

ఇవాళ అధికంగా చెప్పవలెననే కోరిక నాకు లేదు. కేవలం ఒక్క విషయం చెప్పవలసిఉంది. హిందూదేశపు చరిత్రలో బహుశ ఎప్పుడూ సంఘటిల్లని ఒకఘట్టం ఇప్పుడు జరిగింది. హిందూధర్మంలో ఎప్పుడూ ఏ సత్పురుషుని హత్యా జరుగలేదనే అభిమానం నాకు ఉంటూఉండేది. కాని ఆ అభిమానం ఇప్పుడు మట్టిలో కలసిపోయినది. ఒకసత్పురుషునిహత్య జరిగింది. అదికూడా సరీగా ఎలాంటిసమయంలో ? వారు ప్రార్థనకు బయలుదేరినసమయంలో. హిందూధర్మాన్ని ఉద్ధరించుదామనే, రక్షించుదామనేకోరికతో ! ఈనాడువిషయాల్ని గురించి ఆలోచిస్తూఉంటే సిగ్గుకలుగుతూ ఉంది.

నిన్న నేను "మనం ఏడ్చేశిష్యులం కారాదని" చెప్పియున్నాను. అందువలన నేను ఏడ్వడం లేదు. కాని ఏమీ తోచడంకూడా లేదు. అందువల్ల ఇవాళ కొందరు నా దగ్గరికి వచ్చి, 13 రోజులదాకా, గోపురిలో, సామూహిక ప్రార్థనలు జరుపబోతూఉన్నామనీ, అందులో మీరు తప్పక హాజరు కావలసిందని కోరినప్పుడు నేను సహజంగానే ఒప్పుకున్నాను.

"గాంధీజీ జీవితానికి ఇది ఉత్తమమైన పూర్ణాహుతి" యని నాకు తోస్తూఉంది. సర్వోత్తమమైన ఆలోచనలతో, దేహమునుచాలించుట పవిత్రపర్యవసానమని, మతంలో చెప్పబడిఉంది. జీవితం అంతా, నిరంతరం, ధర్మపాలనకే ప్రయత్నించిన ఒకమహావ్యక్తి, తన పవిత్రమైన దినచర్యలన్నీ నెరవేర్చుకొని దేవునిప్రార్థనకు వెళ్లుతూఉన్నాడు. అందరినీ ప్రార్థనకు పిలుస్తూఉన్నాడు. అదేసమయంలో ఆ మహావ్యక్తికి అంతిమ

దశ సంప్రాప్తమైనది. ఈ మృత్యువు చాలాపవిత్రమైనది. ఈ మృత్యువుయొక్క పూర్తిఅర్థమును మనం గ్రహించితే ధర్మ సంశుద్ధి జరిగితీరుతుంది. దేశానికి శుభం కలుగుతుంది.

ప్రార్థనకు ఈ సాయంత్ర సమయం చాలామంచిది. బహు మంచి సమయం ప్రార్థనకు లభించింది. రోజంతా పనిచేసి, సాయంత్రం మన ధ్యానమంతా భగవంతునియందు నిల్పితే మనపని పూర్తిఅవుతుంది. మనం ఎక్కడఉన్నాసరే, సామూహిక ప్రార్థనను మనం మరచిపోకూడదు. ప్రార్థన సమయంలో మనం పూర్తిగా మనస్సును పరమాత్మునిలో లగ్నంచేయాలి. అందువలన మనస్సులోని మాలిన్యమంతా తొలగిపోతుంది. ప్రార్థనలో అద్భుతమైనశక్తి ఇమిడిఉంది. దానివలన శరీరంలో మెరుపువలె ఒకవిధమైన సంచలనం కలుగుతుంది. ఇంతేగాక ఈప్రార్థనవల్ల ఎల్లప్పుడూ గాంధీజీస్మరణ కలుగుతూఉంటుంది. భగవానుడు నారదునితో ఇట్లు చెప్పాడు. ("నాహం, వసామి, వైకుంఠే") వైకుంఠములాంటి ఉత్తమ స్థానంలోకూడా నేనుఉండగోరను. ("యోగినాం, హృదయే, అపి") ఏకాంతంలో ధ్యానం చేసుకుంటూ ఉండే యోగుల హృదయాల్లోకూడా ఉండగోరను. ("రవౌ")అనగా సూర్యమండలములో, సూర్యునిలాంటి ప్రకాశస్థానములోకూడా ఎప్పుడూ ఉండగోరను. కాని ("మద్భక్తా—యత్ర—గాయన్తి—తత్ర—తిష్ఠామి—నారద") భక్తులు పోగుఐ గానంచేస్తూ ఉన్నచోటున నేను తప్పక ఉంటాను." ఇవి పరమాత్ముని వచనాలు.

సరిగా, ఇదే విధంగా గాంధీజీ ఒకసారి చెప్పారు. "ఏడుత్తమ స్థానంలోకూడా నేను ఉండను. కాని ప్రార్థన జరుగుతూ ఉన్నచోట నేను తప్పక ఉంటాను." గాంధీజీ చెప్పిన ఈమాటలు నాచెవుల్లో ఇప్పుడుగూడా మారుమోగుతూ ఉన్నాయి.

(ప్రార్థనసభ. గోపురి. నాల్ వాడి. ది. 1_2_1948)

## 3

"జరిగిన దుర్ఘటనకు అపారదుఃఖం తప్పక కలుగుతుంది. కోపంగూడా విపరీతంగా కలుగవచ్చును. అయినసూ మనం కోపాన్ని అణుచుకోవాలి" అని సర్దార్ వల్లభ్ భాయి తన ఉపన్యాసంలో ప్రజలకు తెలియజేశాడు. "కాని కోపంలో శక్తి లేదు. శాంతిలోనే శక్తి ఉంది." అనేవిషయం మనం గ్రహించ గలిగినప్పుడు సర్దార్ సూచన సఫలీకృతం అవుతుంది. "హిందూదేశం లాంటి వివిధప్రాంతాలతో కూడిన విశాలదేశంలో, హింసకు తావుఏర్పడితే స్వరాజ్యం నిలవదు" అనే విశ్వాసం ఏర్పడినప్పుడే సర్దార్ సూచన సఫలీకృతం అవుతుంది ఏ పాప కర్మ జరిగిందో, దానివెనుక ఒక హింసాపూరితమైన ఆలోచనా పరంపర ఉన్నది. హింసాపూరితమైన అట్టి ఆలోచనాపరంపరను మనం హింసతోనే పూర్తిగా అణచివేయలేము. దానిని అహింసతోనే పూర్తిగా తొలగించివేయగలం. కాని ఇంతవఱకు భారతదేశంలో జరిగిన అహింసానుష్ఠానం, తప్పనిసరిఅయి, ఇంకొకగత్యంతరంలేక అనుసరించిన ఆచరణయే. స్వరాజ్య ప్రాప్తికి అహింసవల్ల ఉపయోగం, లాభం కలుగుతుందనే స్వార్థ

బుద్ధితోనే, అహింస స్వీకరించబడింది. కాని యిప్పుడు అలా కాదు. ఇప్పుడు అలాంటి తప్పనిసరి అయిన దుర్బలులదైన అహింసవలన ప్రయోజనం ఏమీ లేదు. ఇప్పుడు సబలులు ప్రయోగించే అహింసనే మనం నేర్చుకోవాలి. అందుకోసమే పరమాత్ముడు ఈఘట్టాన్ని మనఎదుట ప్రవర్తింపజేశారు. ఈ విషయమై మనం గంభీరంగా ఆలోచించాలి. ఈ దుర్మార్గపు కృత్యం చేసినవాళ్లు (ఇక్కడ బహువచనప్రయోగం తెలిసికొనే చేశాను. ఎందువల్లనంటే, ఇది ఏఒక్క వ్యక్తి జేసిన కృత్యమో గాదు. దీనివెనుక కొంతమంది ముఠా కలదు.) ఈకృత్యం చాలా ఉత్తమమైనదని నిర్ణయించుకొనియే చేసిరి. ఉచితమైన కృత్యం చేసేందుకు హింస చాలా ఉపయోగకారి, ధర్మం, అనే ఈవిధమైన పూజ్యభావం హింసయెడల ఉన్నంతకాలం ఇలాంటి ఏహ్యమైన కృత్యాలూ, పాపకార్యాలూ జరుగక తప్పవు. మనం మన హృదయాల్ని పరిశోధించి చూస్తే అందులోకూడా బహుశః మనకు ఇలాంటి హింసాభావాలు కొన్ని దాగి కనబడవచ్చు. మనహృదయాల్లో ఈదోషం ఏకొంచెం ఉన్నా, అది వందరెట్లు అయి సృష్టిలో తప్పక ప్రవేశించి తీరుతుంది. కోపాన్ని ఆపుకోవడమేకాదు మనం చేయవలసింది. కోపకారకుడైన వానిని ప్రేమించడంకూడా మనం నేర్చుకోవాలి. ఇప్పటివరకు బాపూ ఉన్నాడంటే, ఆయన మనల్నందరినీ వెనకవేసుకొని, కాపాడుతూ ఉండేవారు. కాని ఇప్పుడు మనం ప్రపంచానికి ఎదురుగా నిలబడి ఉన్నాం. ఇక మనలను కాపాడవలసినవి, మనలను రక్షించవలసినవి, మన సదాచారాలు, సదాలోచనలే. నేడు పాడబడిన తులసీదాసు కీర్తనలో మనం అంతా చందనం అయి

పోవాలని చెప్పబడిఉంది. చందనపుకర్రను గొడ్డలి నరికివేస్తుంది. కాని చందనంమాత్రం తద్భిన్నంగా సుగంధాన్ని యిస్తుంది. అనగా మనం కేవలం కోపించకుండా ఉండటమేకాదు చేయవలసింది; అహింసా నిష్ఠ, పెంపొందించుకోవాలి. ప్రేమభావం అధికంచేసుకోవాలి. ఇది అత్యావసరం.

మనం చరిత్రలో చూచేఉన్నాం. ఏసుక్రీస్తు జీవించి ఉన్నంతకాలం అతని శిష్యులు తేజస్సుతో కనబడలేదు. కాని ఏసుక్రీస్తు మరణానంతరం, వారిలో ఒక మహత్తరమైన తేజస్సు దానంతట అదే ఉద్భవించింది. అన్నికష్టాల్ని సహించి వారు ధర్మప్రచారం చేశారు. అందుకు ఫలితంగానే నేడు ప్రపంచంలో కోట్లకొలది క్రిష్టియన్లు కనబడుతూ ఉన్నారు. వీళ్ళంతా కేవలం పేరుకు మాత్రమే క్రిష్టియన్లని నేను అంగీకరిస్తాను. కాని ఆధర్మం పేరునైనా స్మరించేవారు ఇంతమంది ఉన్నారు, అంటే అందులో ఏ కొంచెమో మంచిభావాలు ఉన్నవనే మనం నిశ్చయించుకోవాలి. ఆ కీర్తిఅంతా ఆశిష్యులకు దక్కవలసిందే. శిష్యులలో ఉద్భవించిన తేజస్సుయొక్క ఘనతఅంతా ఏసుక్రీస్తు బలిదానానికే చరిత్రకారులు ఆరోపిస్తూ ఉన్నారు.

గాంధీజీ హత్యజరిగింది. ఈకారణంవల్ల మనం కోపించితే, వివేకాన్ని కోల్పోతే, మనంకూడా గాంధీజీ హత్యలో సమానభాగం పంచుకొనక తప్పదు. తేజో విహీనులం అయిపోతాం అందువలన. మనం మన దేహచింత వదలి, మనన పూర్వకంగా, మన చిత్తాన్ని దోషరహితం చేసుకొని నూతన

మనుష్యులం అవుదాం. అప్పుడు మనం చాలా పనులు చేయుగలం. అందుకు ఏసంఘటనా అవసరం లేదు. ఏరచనలూ అవసరం లేదు. కాని తీవ్రమైన ఆత్మ పరిశోధనమాత్రం అవసరం. ఇందుకు ఆవశ్యకమగు తీవ్రమైన పడబోతలు పరీక్షలు పరమాత్ముడే మనలకు నిర్ణయించి యున్నాడు.

(ప్రార్థనసభ. శాంతికుటీర్. గోపురి. వాల్ వాడి. ది 2-2-1948.)

## ౪

నా ప్రియమైన వర్ధా నివాసులారా!

ఇవాళ ఎక్కువచెప్పవలెననే ప్రేరణ నాకు కలగడం లేదు. కాని మీకోసం రెండుమూడువిషయాలు చెప్పగోరుతూ ఉన్నాను. మీకు నాకు 25 సంవత్సరాలనుండీ సంబంధం ఏర్పడి ఉంది. గాంధీజీ మన ఈ గ్రామంలో 15 సంవత్సరాలు నివసించి యున్నారు. ఇందువలన మనమీద చాలా బాధ్యత పడిఉన్నది. గాంధీజీ 15 సంవత్సరాలు నివసించినచోట వారిసిద్ధాంతాల్లో వారిశిక్షణ తప్పక అమలు జరుగవలసినదే. వారి ప్రభావము ఇక్కడ తప్పక కనబడవలసినదే. హిందూదేశమేగాదు – యావ త్ప్రపంచము మనలనుండి ఇదే అపేక్షించుతూ ఉంటుంది. ఇది గురించి మనం మనజీవితాల్ని శుద్ధిచేసుకోవాలి.

మొట్టమొదట చెప్పవలసినవిషయం హిందూదేశంలో అనేకజాతులు అనేక మతాలు అనేకభాషలు మొదలైన అసంఖ్యాకములైన భేదాలు ఉన్నాయి. వాటిని మనం మన్నించ

గూడదు. భేదాల్ని ముందు మనం మరిచిపోవాలి. అందరితో మనం మన స్వంత సోదరుల్లా వ్యవహరించాలి. ప్రత్యేకించి నవయువకులను, విద్యార్థులను ఉద్దేశించి నేను ఈ విషయం చెపుతూ ఉన్నాను.

హిందూదేశాన్నుండి ప్రపంచమంతటా సందేశం వ్యాపించాలని మనం కోరితే ముందు ఇక్కడనుంచి భేదభావాల్ని అన్నింటినీ తొలగించివేయాలి. "హిందూదేశం మానవుల మహాసాగరం" అని మన పరమపూజ్యకవి రవీంద్రనాథఠాగూర్ ఒకచోట చెప్పియున్నారు. ప్రాచీనకాలాన్నుండీ భేదభావం లేకుండా ప్రేమతో మానవులందరికీ తనలో ఆశ్రయం ఇచ్చింది మన భారతదేశం. మహాపురుషులు మనదేశాన్ని గురించి పై విధంగా గానంచేసియున్నారు. మానవులందరు భేదభావాలు మరచి ప్రేమతో కలసిమెలసి ఉండవలసిన ఆ దర్శం బోధించిన మహాపురుషుడు మనకు లభించాడు. ఇది నిజంగా మన అదృష్టమే. ఇలాంటి మహాపురుషులు వేలకొలది సంవత్సరాల తరువాత లభిస్తూఉంటారు. అందువలన మనం ముఠాలుకట్టడం విభేదాలు పెంచుకోవడం మొదలైన చెడు అలవాట్లన్నీ మరచిపోవాలి. ముఠాలుకట్టడం అంటే రెండుఖండాలయిన భారతాన్ని శతఖండాలుగా చీల్చడమని అర్థం. భారతదేశాన్నుండి ప్రేమసందేశం ఐక్యతాసందేశం ప్రపంచమంతటా వ్యాపింపజేయాలి అంటే ముందు మన హిందూదేశం ఏకం కావాలి. ఒకేరూపం పొందాలి.ఆశియాఖండపు కండ్లన్నీ భారతదేశంమీద ఉన్నాయి. కాని మనభారతదేశంలో నేడు అసంఖ్యాకములైన భేదాలు అనే మందుగుండుతో కొఠారులు నిండిఉన్నాయి. ఒక్కనిప్పు

రవ్వ అందులోపడిందా ఏ క్షణంలోనైనా ఆ కొంపార్లు "ఢాం" అని పేలిపోవచ్చు. ఈ పరిస్థితిలో ఉంది మనదేశం. అందువలన ప్రజలు అన్నిరకాలైన జాతి మత భేద భావాలు మరచిపోయి ఏకమైపోవాలి. అందులోనే మనకు మేలుఉంది.

ఈ సందర్భంలో పానీపట్‌లో జరిగిన యుద్ధంలోని ఒక కథ చెప్పుతాను. బాగా జ్ఞాపకం ఉంచుకోనండి. ఒక రోజు సంధ్యా సమయంలో, అహమ్మద్ షాహిఅబ్దాలీ, తన డేరా నుండి బయటకు షికారుకు వచ్చేసరికి, అతనిదృష్టి మహారాష్ట్రుల డేరాలమీద పడింది. అక్కడ అతనికి చాలా చోట్ల నిప్పు కనబడింది. "చాలాచోట్ల నిప్పు కనబడుతూ ఉందే? ఏమిటిది?" అని తన అనుచరుణ్ణి ప్రశ్నించాడు."హిందువుల్లో అనేక జాతులున్నాయి. వారు ఒకరిచేతి వంట ఇంకొకరు తినరు. అందువలన వారు వేరు వేరుగా వండుకొని తింటూ ఉన్నారు." అని అనుచరుడు జవాబు చెప్పాడు. "అయితే ఏమీ భయంలేదు. నేను ఈ యుద్ధం జయించినట్లే. సందేహం లేదు. ఈ ఒక్క విషయంవల్లనే మనశక్తి ఎందులో ఉందో—బలహీనత ఎందులో ఉందో— తెలుసుకోవచ్చు" అని అబ్దాలీ తన అనుచరుడితో ఉత్సాహంగా చెప్పాడు.

ఇంకొక విషయం చెప్పవలసి ఉంది. మీరు స్వయంగా నిందితుల్ని శిక్షించేందుకు ప్రూనుకోకండి, దోషులకు తగిన శిక్ష ప్రభుత్వం విధిస్తుందనే విశ్వాసం ఉంచండి. అలాగాక మీరే

శిక్షించే వారైతే, అరాచకం ప్రబలి పోతుంది. అలామాత్రం చేయకండి. ప్రభుత్వంతో సహకరించండి. ప్రభుత్వాన్ని దృఢతరం చేయండి. ప్రజలే స్వయంగా నిందితుల్ని శిక్షించడానికి పూనుకుంటే, ఏప్రభుత్వమూ నిలవలేదు.

(ప్రార్థనసభ. గాంధీచౌక్. వర్ధా. ది 3-2-1948. సాయంకాలం.)

౫

ఇవాళ ఒకేవిషయం నేనుచెప్పగోరుచున్నాను. గాంధీజీ మన ఎదుట చాలా ఆలోచనా పరంపరలు ఏర్పరచిఉంచారు. వాటి కన్నింటికీ మధ్యబిందువు ఖద్దరు. తక్కినకార్యక్రమాలన్నింటినీ ఖాదీకి చుట్టుప్రక్కలా సమీపంలోఅమర్చి కూర్చోబెట్టారు. కొద్దిరోజుల క్రితం ఆశ్రమ వాసులు గాంధీజీని సందేశంకోరితే "మీరు ఖాదీశాస్త్రం రచించాలి. అందులోనే మీరు మీ జీవితం అర్పించాలి" అని వారుచెప్పారు. ఇప్పుడు బాపూ వెళ్ళిపోయిన తరువాత మనకందరకూ వారి నిజమైన స్వరూపం_ నామాటలకు తప్పుఅర్థం తీయకుండాఉంటే_ ఖద్దరే. మనంకోరుతూఉన్న ఖాదీజీవితం మనవద్దకూడా లేదు. గ్రామ సేవామండలిలో కార్మికులు ఉన్నారు. కుటుంబీకులే కార్యకర్తలుగా ఉన్నారు. ఇప్పటివఱకు కార్మికులఇండ్లలోనికి ఖద్దరు ప్రవేశించలేదు. కార్యకర్తల ఖద్దరుకూడా అంతాస్వయముగా వడికినేసిన ఖద్దరుకాదు. మనం ఈవస్తువును ఇక్కడే సఫలీకృతం చేసి ఆచరణలోపెట్టి ఋజువుచేయలేకపోతే_ అది మన పరి

శోధనాబుద్ధిలోని లోపమనే నిశ్చయించుకోవలసి ఉంటుంది. మన వాళ్లంతా వేరువేరు పరిశ్రమల్లో నిమగ్నులై ఉన్నారనే విషయం నిజమే. కాని ఇతర ఏపరిశ్రమా లేనివారే నూలు వడకమనే ఉద్దేశ్యంమాత్రం మనదికాదు. "బట్టకట్టుకొను ప్రతివాడు నూలువడకాలి. వడికిననూలు నేతవారిచేత నేయించుకోవాలి," ఇదే మనఉద్దేశ్యం. కనీసం మనబస్తీలోనైనా ఈ ఆశయం ఆచరణలోబెట్టి సఫలీకృతులం అయ్యే ప్రయత్నం మనం చేయవలసిఉంది.

అదేవిధంగా ఇక్కడ మహిళాశ్రమంఉంది. అక్కడ సోదరీమణులంతా నూలు తప్పక వడుకుతూనే ఉంటారు. కాని వారుమాత్రం ఖాదీభండారంవెళ్ళి ఖద్దరు కొంటూవుంటారు. మహిళాశ్రమం ఖద్దరువిషయంలో పూర్తిగా స్వావలంబిఅయితీరవలసిందే. నూలంతా బాలికలచేత నేయించాలి. అందులోనే మనం నేర్పే శిక్షణఅంతా ఇమిడిఉంది. ఆ అనుభవం ప్రతివారు తమజీవితంలో పొందాలి. అప్పుడే గాంధీజీశిష్యుల నుంచి కోరబడుతూఉన్న తేజస్సు ప్రజలకు కనబడుతుంది. అప్పుడే గాంధీజీ మనుష్యుల్లోని తేజస్సు "ఫలానా" అని మనం చెప్పగలుగుతాం.

ఇదే విషయం కళాశాల విద్యార్థులనుగురించికూడా చెప్పవచ్చును. వారిలో చైతన్యం కలిగితే, వారు ఖాదీజీవితాన్ని ఆచరణలోబెట్టి ఋజువుచేయుడంలో తమశక్తిని, బుద్ధిని, వినియోగిస్తే తప్పక పురుషార్థులు, నిజమైన దరిద్రనారాయణ సేవకులు అవతారనేందుకు ఏమాత్రం సందేహం లేదు.

ఏకత్వంకోసం మనం ఏవోకొన్ని బాహ్యచిహ్నాలు ఏర్పరుచుకుంటాము, కాని ఖద్దరుకంటె- స్వావలంబన, ఖద్దరుకంటె మించిన ఇంకొకచిహ్నం ఏదియూలేదు, ఘంటాపథంగా లేదని చెప్పవచ్చు. దీనివలన నిర్మాణాత్మకమైనశక్తి కలుగుతుంది. దానివల్లనే నేడు వ్యాపించియున్న హింసకు మనం ప్రతీకారం చేయగలుగుతాం.

మాకు చాలపని ఉంటూఉంటుంది. అందువల్ల నూలు వడికేందుకు మాకు సమయం ఉండదు. ఈవిధంగా అనుకోవడం ఆత్మవంచనచేసుకోవడమే. గాంధీజీ ఉదాహరణయే మన ఎదురూగాఉంది. వారు అనేకరకాలైన పనుల్లో రోజంతా నిమగ్నులై ఉండేవారు. అయినాసరే- నూలువడికేందుకుమాత్రం- తప్పక కొంతసమయం వినియోగించుతూ ఉండేవారు ప్రతిరోజూ కూడా.

(ప్రార్థనసభ. శాంతికుటీరం. గోపురి. నాల్ వాడి. ది 4-2-1948)

౭

గాంధీజీ హత్య సందర్భంలో యావత్ప్రపంచంలోని మహాపురుషులంతా తమ హృదయపూర్వకమైన శోక - సందేశాలు వెల్లడించారు.

"గడచిన మహాయుద్ధం, మానవుల్లో ఎంతటి పశుత్వాన్ని ప్రచారం చేసిందో ఈ ఘట్టం తెలుపుతూ ఉంది" అని ఒక దేశపు ముఖ్యప్రధాని చెప్పియున్నాడు.

"మనం గాంధీజీ ఉద్దేశ్యాలవల్ల కలిగే ఆశ్రయం పొంది తీరవలసిందే. గాంధీజీ సిద్ధాంతాలవల్ల దప్ప, ప్రపంచానికి

శాంతి లభించదు" అని ఆ మహాయుద్ధంలో ఒక గొప్ప సేనాధిపతిగా ఉండి పనిచేసిన మెకార్థర్ చెప్పియున్నాడు. ఈ మాటలు ఒక గొప్ప సేనాధిపతి చెప్పిన మాటలు గనుక మన దృష్టిని ఆకర్షించుతూ ఉన్నాయి.

ఎక్కడినుండి అయితేనేమి? మొత్తంమీద హింసా వాయువులు మన హిందూదేశంకూడా వచ్చి వీచడం ప్రారంభించాయి. ఇంత పెద్ద దేశంలో వివాదాలు ఉండటం సహజమే. ఈ వివాదాల్ని, అభిప్రాయ భేదాల్ని అణచివేసేందుకు, లేక తీర్చేటందుకు హింసకే ప్రాధాన్యత కలిగితే అనర్థం కలిగి తీరుతుంచి. ఈ విషయం అందరికీ అర్థం కావలసింది. కాని అర్థం కావడంలేదు. "చివరకు అహింస ఆశ్రియం పొందవలసి ఉంటుందనీ, కాని ఇప్పుడుమాత్రం హింస లేకపోతే పని జరగదనీ" గొప్పగొప్ప ఆలోచనాపరులు చెపుతూ ఉన్నారు. కాని ఇందులో మనం తెలుసుకోవలసిన ముఖ్యవిషయం ఒకటి ఉంది. అహింస చివరమాత్రమే అవలంబించ వలసిన ధర్మం కాదు. ఇప్పుడే అవలంబించవలసిన ధర్మం కాదు. చివరి ధర్మమూ అహింసయే. మధ్య ధర్మమూ అహింసయే. ఎల్లప్పుడూ అవలంబించవలసిన ధర్మమూ అహింసయే. కాని అహింసా ధర్మపు అత్యావశ్యకత ఎప్పుడైనా ఉన్నదీ అంటే— ఆ అత్యావశ్యకత — ఇప్పుడే ఉన్నది.

ఇప్పుడు అహింస కావాలా లేక హింస కావాలా? అనే ప్రశ్న అసలు లేనేలేదు. నా దృష్టిలో. ఈ విషయం నేను స్పష్టంగా చెప్ప గోరుచున్నాను. ఇప్పుడు నిర్ణయం

చేయవలసింది విజ్ఞానం, మరియు హింస విషయాల్లోనే. "విజ్ఞానం—హింస" ఈ రెండూ వెంట వెంట కలసి నడవలేవు. రెండూ కలిస్తే మనల్ని తినేస్తాయి. హింస మీదనే గట్టిగా, దృఢంగా నిలవదలిస్తే విజ్ఞానాన్ని వదిలిపెట్టండి. పురాతన కాలానికి వెళ్లిపొండి. అందువలన ప్రపంచానికి కొంత మేలు కలుగుతుంది. ఈ మారణాయుధాలు తగ్గిపోతాయి. ఒకవేళ హింస జరిగినా ఇప్పటివిధంగా ఘోరనాశనం సంభవించదు. అలా కాక విజ్ఞానాన్నే నిలిపి ఉంచుదామంటే హింసను తుద ముట్టించి తీరాలి. విజ్ఞానంలో మహత్తరమైన శక్తి ఉంది. హింసను త్యజించితే, విజ్ఞానసహాయంతో భూలోకంలో స్వర్గ లోకం సృష్టించవచ్చు. కాని విజ్ఞానంతోబాటు హింసను జోడిస్తే అవి రెండూకలిసి మానవుని అంతంచేసివేస్తాయి. అందువలన విజ్ఞానాన్ని గౌరవించే ప్రతి ఒక్కరూ హింసకు వ్యతిరేకంగా ఆందోళన చేయాలి.

శిక్షణశాస్త్రం గూడా ఈ విషయం గ్రహించాలి. హింస శిక్షణశాస్త్రానికి బద్ధశత్రువు. హింసాకాండ జరిగినచోట శిక్షణ ఆగిపోవలసిందేకదా? సమాజశాస్త్రంగూడా ఈ విషయంగ్రహిం చాలి. సమాజానికి ఆధారం హింసకాదు, అహింసయే. అహింస లేకపోతే సమాజశాస్త్రమే నాశనమై పోతుంది. ఈ విధంగా ఆలోచించినప్పుడే, ఈ హింసారాక్షసుడు తొలగిపోతాడు.

బాపూ వెళ్ళిపోయారు. వారి స్మారకచిహ్నాల్ని గురించి చర్చలు జరుగుతూ ఉన్నాయి. మనం అహింసాత్మకమైన జీవి తాన్ని బుజువుచేయకపోతే, స్థూలంగా మనం స్థాపించే గాంధీజీ

స్మారకచిహ్నాలవలన ఎగతాళిపాలుఅవుతాం. అందువలన ఈ పదమూడురోజులు మనంబాగా ఆత్మమథనం చేసుకుందాం. జీవితంలో పరివర్తనం మార్పు తెచ్చుకుందాం.

"మనం ప్రాయశ్చిత్తం చేసుకోవాలి"అని ఒక సోదరుడు వ్రాశాడు. అదిఏమైఉండాలి? మనహృదయంలో ఏ ఒక్కమూల నైనా హింసవలన లాభంకలుగుతుందనే ఆశ ఏమాత్రంఉన్నా, దానినిమనం వెంటనే తొలగించివేయాలి. ఇదేఉత్తమమైనప్రాయ శ్చిత్తం. కాని ఇదిచెప్పవలసిన, ఉపన్యసించవలసిన విషయం కాదు. మాట్లాడినందువలన, ఉపన్యాసాలు ఇచ్చినందువలన ఇది జరిగే పనికాదు.

సామాన్యంగా నేను మాట్లాడేటందుకు అలవాటుపడిన వ్యక్తినికాదు. నాకు మాట్లాడటమంటే మొదటినుంచీ అమిత మైన అయిష్టం. ఈ సమయంలో ఇక్కడమాట్లాడటం నాకు భారంగానే ఉంటూఉంది. అయినప్పటికీ సహచరులంతా కూర్చొని ఉన్నారు. వారితో మాట్లాడుతూఉన్నాను. అందు వలన నా సంకల్పాలకూ, నా భావాలకూ దృఢత్వం కలుగుతుంది కదా! అనే ఉద్దేశ్యంతో మాట్లాడుతూఉన్నాను. నేను, నాతోనే మాట్లాడుకుంటూ ఉన్నట్లుగా, భావించి, మాట్లాడుతూఉన్నాను.

(ప్రార్థనసభ. శాంతికుటీరం. గోపురి. వాల్ వాడి. ది 5-2-1948)

## ౭

ఇవాళ మనం విన్న తులసీ రామాయణంలోని భాగా నికి మహత్త్వపూర్ణమైన అర్థం ఉన్నది. అందులో రూపంకంటె నామం గొప్పదని చెప్పబడింది. రూపం కొద్ది రోజులవఱకే

ఉంటుంది. ఆలెఖ్ఖ ప్రకారం నామం శాశ్వతం. సారాంశ మేమంటే, ఒకవ్యక్తి, అతడు రామచంద్రునిలాంటి వాడైనా సరే.—చేయగలిగిన దానికంటె, అధికంగా చేయగలిగిన శక్తి, నామంలో ఉంటుంది. రూపం అనగా వ్యక్తి అన్నమాట. నామం అనగా ఆలోచన లన్నమాట. వ్యక్తి కూడా గొప్ప వాడై ఉండవచ్చు అనగా ఆలోచనల బాహ్య స్పష్టీకరణకు ఆ వ్యక్తి నిమిత్తమాత్రుడు అన్నమాట. అయినప్పటికి శక్తి ఆలోచనలో నిండి ఉంటుంది. దాని అనుభవంకూడా కలుగు తూనే ఉంటుంది. వ్యక్తియొక్క అస్తిత్వం కొన్ని అంశాల్లో, ఆలోచనకు సహాయంగా ఉంటుంది. అదే విధంగా ఒక్కొక్క ప్పుడు దానివల్ల ఆలోచనకు హానికూడా కలుగవచ్చు. వ్యక్తి తొలగిపోయినా, అతనిలోని పరిశుద్ధ ఆలోచనలు మాత్రం మిగిలి ఉంటాయి. అందువల్లనే తులసీదాసు "రామునికంటె నామమేగొప్ప" యని వర్ణించి యున్నారు. రాముడు తరింప జేసిన పతితులను మనము లెక్కింపవచ్చు. కాని రామనామం ఎంతమంది పతితులను తరింప జేసిందో, ముందుకూడా ఎంత మందిని తరింపజేస్తుందో ఎవరు లెక్కింపగలరు? ఈ ఆలోచన లోని సామర్థ్యాన్ని తులసీదాసు నామమహిమ ద్వారా నిరూ పిస్తూ వర్ణించియున్నారు. ఆలోచనద్వారా, ఆలోచనాసూచక మైన నామంద్వారా లభించ గలిగినంత శాంతి, ఇంకే వస్తువు వల్లా మానవునికి లభించదు. అందువల్లనే నామ స్మరణలోని మహిమ గానం చేయబడింది. నామ స్మరణవల్ల సహజంగానే హృదయ పరివర్తనం జరుగుతుంది. ఇదంతా మనన, ధ్యానా లకు ఫలితమే. దానివలన మార్గదర్శనం కూడా లభిస్తుంది. సజ్జన

సంచారకులు తమ జీవితకాలంలో, కాలేనంత సమర్థులు, శక్తి శాలురు,—జీవితానంతరం కాగల్గిరి. ఈ విషయం మనకు తెలిసినదే. స్థూలరూపం తొలగిపోయింది. దానితోబాటు, ఉన్న లోట్లు కూడ తొలగి పోయాయి. పరిశుద్ధమగు దివ్యమైన అంశంమాత్రం మిగిలింది. కాని మనకు ఒకమోహం ఉంటుంది. దానిని ఏమని అందాం? "రూపమందుండే మోహం" అని అనవచ్చు. దానివల్ల అసలు రూపం మననేత్రాల ఎదుటనుండి అదృశ్యమైపోయిన ఒక్క క్షణకాలం, అంధకారం వ్యాపించుతుంది. కాని ప్రకాశంమాత్రం లోపించదు. మనం పలకమీద అక్షరాలు వ్రాస్తాం. తరువాత వాటిని చెరిపివేస్తాం. అయినా వాటి భావంమాత్రం చెరిగిపోదనే విషయం మనకుతెలుసు. అదేవిధంగా ఒకానొకవ్యక్తిద్వారా గొప్పభావాలు బయల్వెడలితే, ఆవ్యక్తి నశించిపోయినంతమాత్రాన ఆయన భావాలు నశించిపోవు. ఇంకా భావప్రకాశం ఎక్కువ స్వచ్ఛమవుతుంది.

బాపూ జీవితకాలంలో వారిభావాలయెడ మనకు ఎంతో శ్రద్ధఉండేది. ఆశ్రద్ధ వారిదేహత్యాగంవల్ల తగ్గిపోయేదిమాత్రం కాదు. కాని మనశ్రద్ధలో ఉన్నలోటు,, సంకోచం అన్నీ ఇప్పుడు పూర్తిగా తొలగిపోతాయి. తొలగిపోకతప్పదు. బహుశ యిందుకోసరమే ఇలాంటిమార్పులు భగవంతునిసృష్టిలో జరుగుతూ ఉంటాయి. "బహుశ"అని ఎందుకు అంటూఉన్నానంటే,ఈశ్వర సృష్టిని మనం నిశ్చయపూర్వకంగా తెలుసుకొనలేముగదా? అది మన "బుద్ధి-శక్తి" రెండింటికీ అతీతమైనవిషయం. అందువల్ల

మనం ఆ చింతలో పడకూడదు. ఇలాంటి ఘట్టాలవల్ల, ఆంతరంగికంగా మనకు ఏమిబలం చేకూరగలదో మనం ఆలోచించాలి. ఆ విధంగా ఆలోచించితే మాత్రం చాలా లాభిస్తుంది. ఇవాళఉదయం చింతనలోఉండగా ఈ అభిప్రాయం తోచింది. దానినే తులసీదాసు వచనాల ఆధారంతో మీఎదుట ఉంచాను.

(ప్రార్థనసభ. శాంతికుటీర్. గోపురి. నాల్‌వాడి. ది 6-2-1948.)

౮

గాంధీజీ స్మారకాల్ని గురించి జనం ఇప్పుడు చర్చించుతూ ఉన్నారు. గాంధీజీజీవితం చాలా వ్యాపకమైన జీవితం. జీవితపు చాలా శాఖలతో ఆయనకు సంబంధం ఉండేది. ఇందువల్ల రకరకాల స్మారకాలు తయారవుతాయి. యావత్తుదేశం తరఫున కూడ తప్పక స్మారకం ఏర్పడుతుంది. కాని ఈ స్థూల స్మారకాలన్నింటివల్లా, వాస్తవమైన స్మరణమాత్రం జరుగదు. అసలు ఈస్మారకచిహ్నాలవల్ల ముఖ్యమైనవస్తువు దృష్టినుండి మాయమైపోతుందనే భయం నాకు కలుగుతూఉంది. అనేక సందర్భాలల్లో, ఆవేశసమయాలల్లో, భావతరంగాలు విపరీతంగా లేస్తూఉంటాయి. ఆ సమయంలో భావాలకు సమాధానం చెప్పేటందుకు మానవుడు కొన్ని బాహ్యకార్యాలుచేయడం తథ్యం. ఆ తరువాత ఆ తరంగాలు వాటంతటవే, అణగారిపోతాయి. దుఃఖవేగం వచ్చినప్పుడు గంభీరహృదయుడు ఆవేగాన్ని లోలోనే ఆపుకుంటాడు. దానివల్ల శక్తిని కలుగజేసుకుంటాడు. ఈ గాంభీర్యం లేనిచోట దుఃఖం ఏడుపురూపంలోనో, కన్నీటిరూపంలోనో, బయల్వెడలుతుంది. అందువలన చిత్తానికి సమాధానం కలుగుతుంది.

ఇలాంటి సమయాల్లో కొందరు తమ బుద్ధివైశద్యంవల్ల, కొంత కాలంబాటు మంత్రిముగ్ధులై ఉండి, ఆ తరువాత తమలోని, వేగాన్ని అనేకవిధాల బయటకు వెల్లడిచేసి శాంతిని పొందుతూ ఉంటారు.

ఇలాంటి సందర్భాలల్లో అనేకరోజులు భజనలు చేస్తూ ఉండేవాళ్లను చాలామందిని నేను చూచాను. భజనలుకూడా మనస్సులో కలిగిన ఒకఆవేశమే.
కాని వాటివల్ల జీవితంమీద ప్రత్యేకించిన ప్రభావం ఏమీ పడుతూఉన్నట్లు నాకేమీ తోచదు. మంచిభావాలు అందులో ఎన్నిఉన్నా, ఏమీ లాభంలేదు. కాని అది ఒక ఆవేశమే. ఆ భజనలు మనస్సులోకలిగిన ఒకఆవేశానికి సమాధానంమాత్రమే.

కాని మనం ఇలా జరుగనీయకూడదు. మనం గంభీరంగా ఆలోచించుకొనేవృత్తి అలవరుచుకోవాలి. జీవితమే పరివర్తితమై మారిపోవాలి. మనజీవితంపాపభూయిష్ఠమనేవిషయంమనం బాగా గుర్తించాలి. నిజంగా పాపులం కాకపోతే మొన్నజరిగిన ఘట్టం జరిగిఉండేదేకాదు. "గాంధీజీలాంటి పవిత్రుడైన మహాపురుషుని మీదకు హంతకుడిచేతులు ఎలాలేచాయి?" అని ఒక అను చరుడు ప్రశ్నించాడు. ఇది ఆలోచించతగిన విషయమే, నేను ఇలాజవాబుచెప్పాను."గాంధీజీని ఒకానొకవ్యక్తిమాత్రంగాఎలా ఎంచవచ్చు? వారు మన అందరిబరువూ మోస్తూఉన్నారు ఇంత వరకూ.మనజీవితాలు చాలా మాలిన్యంగా ఉన్నాయి. కనుకనే ఈ హత్యజరిగింది. వారు ఒకేఒకవ్యక్తి అయిఉంటే, మన అందరి భాగం,వారువహించి ఉండకపోతే-అది వేరేవిషయం.కాని వారు

మనఅందరిబాధ్యత వహించారు. చివరివఱకు ఆ బాధ్యతను నిర్వ హించారు. అందువల్ల ఈ హత్యాబాధ్యత మనది. ఈ విధంగా తలచి, మనలోఉన్న భావదోషాన్ని ముందు సమూలంగా తొలగించివేసుకోవాలి. జీవితంలోకూడా అలాంటి పరివర్తనమే పొందాలి. లేకపోతే కేవలం బాహ్యాచిహ్నాలు- అవి యెంత ఉపయుక్తమైనవి అయినా- మనందేనికోసం- తయారుకావలసి ఉందో, ఆ పనినిమాత్రం అవిపూర్తిచేయజాలవు. ఈవిధంగా తయారుకాకపోతే జరిగినఘట్టానికి ప్రాయశ్చిత్తం జరుగదు.

(ప్రార్థనసభ. గోపురి. నాల్‌వాడి. ది. 7-2-1948.

౬

నిన్న నేను స్మారకచిహ్నాలనుగుఱించి మాట్లాడుతూ, బాహ్యాచిహ్నాలచింతలోబడి లోపలివస్తువును మనం మరిచిపోకూడదనిచెప్పియున్నాను. అయినప్పటికీ బాహ్యస్మారకచిహ్నాలు ఏర్పడకతప్పవు. వాటిలోగూడా వివేకం ఉపయోగించాలి. స్మారకచిహ్నాలవిషయంలో సూచనలు తెలుపుతూ, నాదగ్గరకు రెండుమూడుఉత్తరాలు వచ్చాయి. "సాధ్యమైనంతవఱకు ప్రతి గ్రామంలో గాంధీజీమందిరాలు స్థాపించాలి. ఆ దేవాలయల్లో గాంధీజీ, కస్తూర్‌బా విగ్రహాలే ఉండాలి" అనేదిగూడా నా దగ్గరకువచ్చిన సూచనల్లో ఒకటి. ఈ విధంగ సూచనజేసిన మిత్రుని భావాన్ని గౌరవించినప్పటికి ఈపనిమాత్రం చాలా ప్రమాదకరమని నానమ్మకం. నేడు భారతదేశంలో వారివారి శిష్యులచేత అవతారపురుషులని ఎన్నబడినవారుకూడాఉన్నారు. కాని గాంధీజీ విషయంలోమాత్రం (ఇలాంటి మూఢభక్తి)

మనకువద్దు. గాంధీజీ సంపూర్ణమానవుడు. మానవుడుగనేజీవించారు. వారిని ఆ స్థితిలో, ఆ రూపంలో ఉండనివ్వడమే మనకు చాలా లాభం. ఈవిధంగా చేయడంవల్ల ప్రపంచంలోని మానవుల్లోకెల్లా ఒక శ్రేష్ఠుని, సజ్జనుని చిత్తరువు మనఎదుటఉంటుంది. ఒక నైతికఆదర్శం మనకు లభిస్తుంది. ఆనైతికఆదర్శం నేడు ప్రపంచానికి చాలాఅవసరం. అందుకుబదులు గాంధీజీని దేవతగా చేసేస్తే, అందువల్ల దేవతలకు కలిగేలాభం ఏమీఉండదు. కాని మానవసంబంధమైన ఒక మహోన్నత ఆదర్శం, మనం పోగొట్టుకొన్నవారం అవుతాం. భక్తిభావానికి కావలసిన సామగ్రి మన దగ్గర మొదటినుండి చాలాఉంది. అందుకు ఇప్పుడు నూతనంగా ఒక క్రొత్తదేవత మనకు అవసరంలేదు. కాని జీవనశుద్ధికి కావలసిన ఒక పవిత్రమైన ఉదాహరణమాత్రం మనకుకావాలి. నీతిని గరిపే పురాతన ఉదాహరణలల్లమాత్రం ఆపని జరుగదు. నూతన ఉదాహరణవల్లనే ఆపని తేలికగా జరుగుతుంది. అలాంటి ఉదాహరణ బాపూరూపంలో మనకు లభించింది. అలాంటిగాంధీజీని మనం దేవతగామార్చివేస్తే, మనజీవితశుద్ధికి లభించిన ఈ అమూల్యఉదాహరణాన్ని పోగొట్టుకుంటాం. అందుకు బదులు మనకు దొరికేలాభం ఏమీఉండదు. ఇప్పటికే దేశంలో చాలామంది దేవుళ్లు ఉన్నారు. అనేక సాంప్రదాయాలు ఉన్నాయి. మనం ఇంకొక దేవుని, ఇంకొక సాంప్రదాయాన్ని సృష్టించినవారం అవుతాం. దానివల్ల మనకు దొరికేదేమిటి ? ఏమీ లేదు.

ఇంతకంటె మంచివిషయం ఏమంటే గాంధీజీ ఏ రామనామ స్మరణచేస్తూ భౌతిక దేహయాత్ర చాలించారో, ఆ రామనామమే మనమూ స్మరింతాం. ఆరామనామాన్నే గానం చేతాం.

రాముడుకూడా దశరథుని కుమారుడనిగాదు మనం స్మరించేది. మనం స్మరించేది, దశరథుడు తనకుమారుడికి పెట్టిన నామాన్నే.— అనగా అంతర్యామి ఆత్మారాముడు అన్నమాట. పరమాత్మునికి గుణాలు అనంతం. ఆ గుణాలన్నీ విచారించి మనం అనేక పేర్లతో స్మరింపవచ్చు. కాని ఏ మానవుని పేర—పరమాత్ముని—పిలవ కుందుముగాక. వేరు .వేరు మతాలవల్ల, సాంప్రదాయాలవల్ల, భూత కాలంలో జరిగిన రక్తపాతాలే మనం ఏర్పరిచేయిలాంటి సంప్రదాయాలవల్ల, భవిష్యత్తులోకూడా జరుగవచ్చునని నా అమితభయం. అందువల్ల వినమ్ర భావంతో గాంధీజీ మానవత్వాన్ని ఆదరిస్తూ వారిగుణాల్ని అనుసరింతాం. చేతనైతే వాటిని ఇంకా అభివృద్ధి పరుచుకుందాం. కాని విగ్రహాల్ని మాత్రం అభివృద్ధి చేయకుందుముగాక.—

(ప్రార్థన సభ. సేవ్రి. నాల్‌వాడి. ది 8-2-1948.)

౧౦

అన్నిధర్మాల్ని శుద్ధిచేసేందుకు, అన్నిమతాల్ని ఏకం చేసేందుకే గాంధీజీ బలిదానంజరిగింది. హిందూదేశంలో అనేక మతాలు మరియు భావసమన్వయం ప్రాచీన కాలంనుండి జరుగుతూనేఉంది. హిందూ— ముస్లిం సంబంధం ఏర్పడినప్పటినుండీ, ఇద్దరి సమన్వయంకోసం కబీరు, నానక్ మొదలైన సజ్జన పురుషులు ప్రయత్నాలుచేశారు. "రామ్— రహీమ్ ఏక్‌హై" "కృష్ణ— కరీమ్‌ఏక్‌హై" ఈ వచనాలువారివే. కాని ఇప్పుడు ముఖ్యంగా రాజకీయ కారణాలవల్ల హిందూ — ముస్లిం భేదాలు కల్పించబడ్డాయి. వృద్ధిచేయబడ్డాయి. అందువల్లనే ఇప్పుడు

"ఈశ్వర్ అల్లా తేరేనామ్"అనే పిలుపును గాంధీజీ బయలు దేరదీశారు. దానికి ఫలితమే వారి దేహసమర్పణ. ఈ మధ్య భేద భావాలు– పెంచబడ్డ భేదభావాలు–విపరీతంగా పెరిగిపోయాయి. లేకపోతే భావసమన్వయం కుదిరిందనే చెప్పవచ్చును. ప్రజల్లో కలయికకూడా ఏర్పడింది. ప్రజలు ఒకరు ఇంకొకరి ఉత్సవాల్లో పాల్గొంటూ, కూడా ఉండేవారు. రెండుసంఘాలూ ఒకేరూప ములో నడువసాగాయికూడా. ఇప్పుడు భేదభావ ప్రచారంవల్ల ఒకరిని, గురించి ఇంకొకరిలో అనుమానాలు విపరీతంగా పెరిగి పోయాయి. కాని త్వరలోనే అవి తొలగిపోతాయి. తొలగి పోవాలి. అందుకు "ఈశ్వర్ అల్లా తేరేనామ్" ఈ మంత్రమే సమర్థమైనది. యోచనాపరులు ఒకరు ఇంకొకరిమతాన్ని పరి శీలించగలరు. అర్థంచేసుకోగలరు. సమన్వయంకూడా పూర్తిగా జరుగుతుంది. కొద్దిసంవత్సరాలకిత్రం కురాన్ అభ్యసింతామని నాకు తోచింది. అంతకంటేముందే నేను కురాన్ ఇంగ్లీషు అను వాదం చదివే ఉన్నాను. కాని అందువల్ల తృప్తికలుగలేదు. ఎందువల్లనంటే అరబ్బీభాష, ఇంగ్లీషుభాష ఈ రెండిటి రచన లోను, శబ్దసృష్టిలోను చాలా భేదముంది. అందువలన అసలు అరబ్బీభాషలోనే కురాన్ మూలం చదువుదామనే నిశ్చయం చేసుకొన్నాను.నా స్వదేశీధర్మం నన్ను పవనార్ వదలనివ్వలేదు. అందువల్ల అక్కడేకూర్చొని ఏదోవిధంగా కురాన్ అభ్యసిం చాను. నేను కురాన్‌లోని శబ్దాల వ్యుత్పత్తిదాకా వెళ్లేందుకు ప్రయత్నించాను. ఈ ప్రయత్నంలో అసలే బలహీనంగా– జబ్బుగాఉన్న నా కండ్లు ఇంకా బలహీనం అయ్యాయి. ఇంకా చెడ్డాయి. కాని మానసికంగా మాత్రం ఎంతోలాభం పొందాను.

"అన్నిమతాలు ఒక్కటే, అన్ని మతాలలో బోధించబడినభావం ఒక్కటే" అనే నమ్మకం మొదటినుండి నాలో ఉన్నది. ఎందువల్లనంటే మానవహృదయం ఒక్కటే. మతాన్నిస్థాపించే మతకర్తలు గొప్పహృదయం కలిగినవారై ఉంటారు కాని ఆ అభ్యాసంవల్ల ఆ విశ్వాసఅనుభవం కలిగింది నేను కురాన్ చదువుతూఉన్నరోజుల్లో ఒక మంచి విద్వాంసుడు, సద్భావాలుగల ఒకసోదరుడు "మీరు కురాన్ చదువుతూ ఉన్నారుగదా? అందులోకూడా అహింస మొదలైనవిషయాలు ఉన్నాయా?" అని నాకువ్రాశాడు, బహుశ ఆయన ఉద్దేశ్యంలో-చాలామంది- ఇలాంటివిషయాలు కురాన్‌లో ఉండటం అత్యాశ్చర్యకరం" అని తలుస్తాను. కురాన్ అధ్యయనంవల్ల "అన్నిమతాలవలెనే, అన్నిమతాలకు ఉండవలసిన లక్షణాలవలెనే ఇస్లాంధర్మంకూడా చాలా ఓర్పుగలిగిన ధర్మం" అనినాకు గట్టినమ్మకం ఏర్పడింది. ఎందువల్లననగా కురాన్ స్వయంగా స్పష్టంగా ప్రకటించినట్లు సత్యప్రచారంలో బలవంతానికి స్థానమేలేదు. కురాన్‌లో నేనుఇంకోరహస్యంకూడా చూచాను. "ప్రపంచధర్మం ఒక్కటే, అయితే మతాలు వేరువేరు. —దీన్. అనగా ధర్మం- అంటే సత్యమార్గంమీద నడుచుట అన్నమాట. ఈ సత్యానికి అభిముఖంగా నడుచుటకు తోడ్పడే పంథాలే మతాలు. అవి అనేకం. వేరువేరుగాఉంటాయి." ఇంకా మీరంతా ఒకేజాతి. ఒకే సమూహం. రీతి, రివాజులు, ఆచార, వ్యవహారాలవల్లనే ఇన్నిభేదాలు ఏర్పడ్డాయి. వాటికి మనం మాహాత్మ్యం ఇవ్వకూడదు." అనికూడా చెప్పబడింది. ఇప్పుడునేను మీ ఎదుట కురాన్‌లోని ఒక చిన్న అధ్యాయం

వల్లించివేశాను, ఇందులోనే ఇస్లాంమతసారం అంతా నిండిఉంది. అందులో భగవంతునిమాత, ఇస్లాంమతప్రవక్త చెప్పినది యిది. "అస్తమించడానికి వెళుతూఉన్న సూర్యుని సాక్షిగా, ప్రతిజ్ఞా వాక్యము చెప్పుచున్నాను. ఏవిధంగా ఈ సూర్యుడు అవనతికి పోనున్నాడో, అదేవిధంగా మానవుని జీవితం క్షణభంగురం, తమజీవితం స్థిరం,అని అనుకొని నమ్మికగూర్చున్నవారి జీవితాలన్నీ నష్టప్రాయమే. ఈశ్వరునిమీద విశ్వాసం ఉంచినవారు, మంచి పనులుచేసేవారు. తమకు హక్కు అర్హతలు ఉన్నంతవఱకు మాత్రమే నిరాటంకముగా నడచే సద్బుద్ధిని ఒకరు ఇంకొకరికి బోధించేవారు, అనగా సత్యమార్గంమీద ధైర్యంతో అనగా శాంతిమార్గాన ధైర్యంతో నడచు జ్ఞానంగలవారు" వీరిజీవితాలు మాత్రం నష్టప్రాయంకావు. కురాన్‌లో "ఈశ్వరునియందు విశ్వాసం ఉంచు అని చెప్పబడినచోటెల్లా వెంటనే మంచిపనులు చేయు" అనిగూడా రెండవవాక్యము జోడింపబడింది. రెండూ కలిస్తేనే ఒక స్థిరమైన సూత్రం లేక సన్మార్గం ఏర్పడుతుంది. ఒకటి అంతరాత్మకు, మరొకటి బాహ్యామునకు సంబంధించినవి. హక్కు మరియు ఓర్పు "అనగా సత్యము మరియు శాంతి" కొద్దిలో ఇదే ఇస్లాం ధర్మం. ఇదేహిందూధర్మం. ఇదే క్రైస్తవ ధర్మం. ఇవే అన్నిధర్మాలుకూడా, అందువల్ల "ఈశ్వర్ అల్లా తేరేనామ్" ఈచిన్నమంత్రం అన్నిధర్మాల్ని శుద్ధిజేసే, సమన్వయపరిచే మంత్రం. ఆమంత్రమునకుశరణుజొచ్చి మనం సత్య, ప్రేమ, నిష్ఠలను పెంపొందించుకుంటే, గాంధీజీచేసిన ఈ బలిదానంవల్ల ఒక నూతనశకం,నూతనయుగం ప్రారంభం కావచ్చు.

(ప్రార్థనసభ, గోష్ఠి, నాల్‌వాడీ. ది 9-2-48)

౧౧

బాపూవిషయంలో ప్రకటింపబడ్డ విలాపప్రకటనలు చూస్తే ఒక ప్రత్యేకవిషయం బోధపడుతుంది. ప్రపంచపునాలుగు చెరగులనుండి ఆ ప్రకటనలు వచ్చిఉన్నాయి. అందులో సంఘటితరూపంలో ప్రభుత్వం నడుపుతూఉన్నవారు ఉన్నారు. హింసాత్మకంగా సంఘటనచేస్తూఉన్నవారుఉన్నారు. యోచనాపరులుకూడా వారిలో ఉన్నారు. అందరూ బాపూసందేశం ప్రపంచానికి చాలా అవసరం అని గుర్తించారు. దీని ఉద్దేశ్యం ఏమిటి? "ఇప్పుడు ప్రపంచంలోని లోచనాపరులు హింసవలన విసుగెత్తిపోయా రన్నమాట. హింసనుండి ముక్తిమార్గం కనబడటం లేదు. కాని గాంధీజీ ప్రపంచం ఎదుట ఉంచిన సామూహిక అహింసనుగురించినభావం ఏదోవిధంగా ఎప్పుడో ఒకప్పుడు అమలు పరచకపోతే ప్రపంచానికి ముక్తిలేదు. ఆ భావాన్ని ఎంత త్వరగా అమలుపరచాల్ననే పట్టుదల ప్రబలుతుందో అంత త్వరగా ప్రపంచానికి మేలుకలుగుతుంది." ఇలాంటిభావం ఆ శోక సందేశాలల్లో ఇమిడిఉంది. హిందూదేశప్రజలకు ఇంతవఱకూ అందులోనివిలువ అర్థం కాలేదు. ఎందువల్లనంటే 150 సంవత్సరాలనుండీ మనజనం జబర్దస్తీగా నిరాయుధులుగా చేయబడ్డారు. బహుశః అందువల్లనే మనజనానికి ఆయుధాలమీద మోజు, విశ్వాసం ఎక్కువగా ఉంది. వాటికి మానసికంగా మాహాత్మ్యం పెరిగింది. మన దగ్గరలేని వస్తువుమీద మోజు కలగడం, మానసికంగా మాహాత్మ్యం పెరగడం సర్వసాధారణం. సమష్టిమీద ఉపయోగపడే అహింసాభావాన్ని

తెలుసుకొనేందుకు మనోబలం కావాలి. కల్పనాశక్తి కావాలి. పురుషార్థం కావాలి. అవే మనలో మృగ్యం. హిందూదేశ నాగరికత, సంస్కారములు దృష్టియం దుంచుకొని, ఈ భావాన్ని తప్పక హిందూదేశంలోనే మొట్టమొదట ప్రవేశపెట్ట వచ్చునని, హిందూదేశం తప్పకుండా ఈ అహింసా భావాన్ని అవలంబించి తీరుతుందనీ గాంధీజీకి పరమ విశ్వాసం. గట్టి నమ్మకం ఉండేది. 25, 30 సంవత్సరాలనుండీ, భారతదేశంలో ఈ అహింసాభావం కొద్దో గొప్పో అమలులో పెట్టబడిన మాట వాస్తవమే,దానివల్ల కొంతమంది హృదయాల్లో అహింస అంటే శ్రద్ధ జనించింది. కాని ప్రపంచానికి మాత్రం అర్థం కావడం లేదు. ప్రపంచం చిక్కుల్లో పడిఉంది. ఈ పరిస్థితిలో ఈముఖ్యమైన భావాన్ని మనం ఎంతవఱకు అనుసరించి, ఆచరణలో పెట్టగలం, దానికి చేయువలసిన, కావలసిన పనులు లేక వస్తువులు మనం ఎంతవఱకు సమకూర్చగలం లేక తయారు చేయగలమో బాగా, లోతుగా దిగి మనం ఆలోచించాలి. మనకు కలిగే సందేహాల్ని నివారణ చేసుకుందాం. విడమర్చి తెలుసుకొందాం. ఈవిధంగా కొద్దిమంది అయినా తమ నిష్ఠను దృఢతరం చేసుకుంటే ఒక భావనాబీజం తప్పకుండా బయలు దేరుతుంది. నాటుకుంటుంది. అందులోనుండి వృక్షం బయలు దేరవచ్చు. కనీసం మనమైనా ఈ విధంగా వర్తిస్తామని లోకం ఆశించకపోతే ఇక ఎవరు వర్తిస్తారని లోకం ఆశించుతుంది? ఈవిషయంలో ఇంకా మనమే సందేహాలతో నిండిన హృదయాలతో బాధపడుతూ

ఉంటే, ఇతరులనుండి ఏమీ ఆశించలేము. అలా ఆశించడం వృథా. దీనిని గురించి ఆలోచిస్తే తతిమ్మా యావత్తు యోజనలు, యావత్తు ఘట్టాలు, యావత్తు పనులు చప్పగ తోస్తున్నాయి. అహింసా పరిశోధన, మన ఆత్మశక్తి నిరీక్షణ చాలా అవసరముగా తోస్తూ ఉన్నాయి.

(ప్రార్థనసభ. గోపురి నాల్‌వాడి. ది 10-2-1948.)

౧౨

నా సోదర సోదరీమణులారా!

ఇవ్వాళ జమనాలాల్‌జీ ఏడవపుణ్యదినం. గాంధీజీ నిర్యాణం అయి పదమూడవరోజు. జమనాలాల్‌జీతో ఆఖరిసారి కలుసుకొనేందుకు సరీగా ఇవ్వాళరోజునే, ఈసమయంలోనే గాంధీజీ ఇక్కడకు వచ్చియున్నారని జానకీదేవి జ్ఞాపకం చేసింది. అదే విధంగా గాంధీజీ అస్థినిక్షేపం సేవాగ్రామాన్నుండి ఇవ్వాళ ఇక్కడికి చేరుకొన్నది. ఆ ఇద్దరు మహాపురుషుల జీవితాలు ఒకటి ఇంకొకటిలో కలిసిపోయాయని దీనిభావం. నేటి ఈ కలయికవల్ల ఈ విషయం దానంతటఅదే ఋజువుఅయినది. వారి జీవితాలే ఈ విషయాన్ని మనకు తెల్పుతూ ఉన్నాయి. గాంధీజీ ఇక్కడికి వర్ధాకువచ్చి పదిహేనుసంవత్సరాలు ఉన్నారు. వారిని ఇక్కడకు తీసుకువచ్చిన కీర్తిఅంతా జమనాలాల్‌జీకే దక్కింది. వారికే దక్కవలసిందికూడా. ఎక్కడెక్కడినుండి ఏఏపవిత్రతలు వర్ధాకు తెచ్చుటకు వీలుఉందో ఆయాపవిత్రతలన్నీ వర్ధాకు తెచ్చారు జమనాలాల్‌జీ. వారు భగీరథునివలె ఇక్కడకు గంగా

నదిని తెచ్చారు. వర్ధాను ఒక పావనపుణ్యక్షేత్రం క్రింద మార్చి వేశారు. ఇక్కడ కనబడుతూఉన్న అనేక సంస్థలన్నీ జమనాలాల్ జీ చేతుల్లో ఆకారం పొందినవే. గాంధీజీ ఆలోచించితే, జమనా లాల్ జీ ఆ ఆలోచనను అమలుపరిచేవారు. ఆలోచించడం గాంధీజీవంతు. అమలుపర్చడం బజాజ్ వంతు. ఇదీ వారిద్దరికీ ఉన్న సన్నిహిత సంబంధం. ఇవ్వాళ జమనాలాల్ జీ దినచర్య పుస్తకం తిరగవేస్తూ ఉన్నాను. ఒకచోట బజాజ్ ఇలా వ్రాశారు. "మాకు ఉత్తమోత్తమమైన గాంధీజీ మార్గదర్శకత్వం లభిం చింది. వారుచెప్పిన, చూపించిన మార్గాన నిష్కామభావంతో ప్రజాసేవజేస్తే ఈజన్మలోనే మోక్షం పొందగలం. ఈజన్మలోనే మోక్షం పొందలేకపోయినా చింతింపవలసిన అవసరం ఏమాత్రమూ లేదు. అనేక జన్మలుపొంది సేవజేస్తూ ఉండటంలో కూడా ఆనందం కలుగుతుంది. బుద్ధిమాత్రం పరిశుద్ధంగా ఉంటే చాలు."

వర్ధాపట్టణానికి వారు ఎంతప్రేమతో సేవజేశారు? కేవలం స్వదేశధర్మంకొఱకే వారు వర్ధాను ప్రేమించారు. నేను పాడబడిన తులసీరామాయణంలోని భరతుని చరిత్ర అంటే వారికి ఎంతోప్రీతి. గాంధీజీకిగూడా ఆభాగమంటే చాలామక్కువ. "భరతవర్షం" అనే మనదేశపు పేరుకుగూడా భరతునితో సంబంధం ఉన్నది. రామునిదగ్గరే ఉండేటందుకు భరతునికి అనుజ్ఞ లభించలేదు. అయినప్పటికీ భరతుడు రామునామంపేరట అతనిపని అంతా నెరవేరుస్తూ ఉన్నాడు. ఈరాజ్యం నాదికాదు.

రామునిది అనినమ్మి ఆ రాజ్యశాసనం చేశాడు భరతుడు. కవి ఇలా వర్ణించాడు. "రామచంద్రుడు అడవికి వెళ్లిపోయాడు. తపశ్చర్యలవల్ల రామచంద్రుడు అడవిలో సన్నగిలి కృశించి పోయాడు. కాని భరతుడు అయోధ్యానగరంలోనే ఉండికూడా తపశ్చర్యలవల్ల కృశించిపోయాడు. ఒకరితపస్సు అడవిలో, ఇంకొకరి తపస్సు అయోధ్యానగరంలో. రామచంద్రుడు వన వాసం పూర్తి చేసి అయోధ్యకు తిరిగివచ్చారు. భరతుని కలుసు కొన్నారు. ఆసమయంలో_ ఆ రామ, భరతుల కలయిక సమ యంలో అడవినుండి వచ్చిందెవరో, అయోధ్యనుండి వచ్చిం దెవరో తెలుసుకోవడం మహాకష్టమై పోయింది." ఈవిధమైన భరతునిచరిత్రను, గాంధీజీ_ బజాజ్ జీ_ ఇద్దరూ తమఎదుట ఆదర్శంగాపెట్టుకొన్నారు. ఇప్పుడు జమనాలాల్ జీ వెళ్లి పోయారు. గాంధీజీకూడా వెళ్లిపోయారు. వర్ధాలోని మేము, ఇక్కడినాగరికులగు మీరు_ అందరంకలిసి నిరంతరము మనకు సేవ జేసి వెళ్లినవారి నిర్యాణం తరువాత వారిపుణ్యతిథి దినము జరుపుచూఉన్నాము. ఇందులో వారికోసం మనంచేసేది ఏమీ లేదు. వారు తమ ఉత్తమకార్యములవల్లనే పుణ్యగతిని పొంది యున్నారు. మనం మనచిత్తశుద్ధికొఱకే ఇదంతా చేస్తూఉన్నాం.

జమనాలాల్ జీ మరియు గాంధీజీ, ఇద్దరూ ఏవిధమగుజాతి మత భేదభావాలు మనస్సులోఉంచుకోకుండా "మానవమాత్రు లంతా ఒక్కటే" అని నమ్మి ఆ విశ్వాసంతోనే సేవజేశారు. బీదవారితో సమానులగుటకు దరిద్రనారాయణుని వేషం సం పూర్తిగా ధరించుటకు ప్రయత్నంచేశారు. "పర హితబస జీన్ కే

మనమాహీ:, తనకహా:,జగదుర్లభక ఘనాహీ:," "ఎవరి మనస్సులో ఇతరులకు హితము చేయుదమని ఉంటుందో అతనికి ప్రపంచంలో దుర్లభమైన విషయం ఏమీ లేదు." తులసీదాసు చెప్పిన ఈ వచనాన్ననుసరించి, ఇతరులకు హితంజేస్తూ ప్రపంచంలోని సర్వస్వాన్ని సాధ్యంచేసుకున్నారు. ఈవిధంగా ఆ ఇద్దరు ఆదర్శ పురుషులూ మనఎదుటనే అదృశ్యమై పోయారు.

"మనం మనస్వార్థాల్ని తగ్గించుకొందాం" అని సాధారణంగా ప్రతివాడూ తలుస్తూ ఉంటాడు. కాని ఏ స్వార్థాల్ని నీవు తగ్గించుకోగలవు? "మన శరీరం ఏదో ఒకరోజున వదలి వెళ్లవలసిందే. ఆసితిలో, లోకసేవలో చందనంలాగా మనశరీరాన్ని అరగదీయవలసిందే." ఎప్పటివఱకు చందనంఅరగదో అప్పటివఱకు అందులోనుండి సుగంధం బయటికిరాదు. చందనం అసలు అరగదీయకనేపోతే ఇంక సుగంధం ఎక్కడినుండి వస్తుంది ? అప్పుడు ఇతరచెట్లకు చందనానికి భేదం ఏముంటుంది ? మనం సేవచేయకపోతే మానవజన్మపొంది ఏమిసాధించినట్లు? తినడం, త్రాగడం, భోగాలు అనుభవించడమే జీవితానికి సార్థకత్వం అని అనుకుంటే జంతువుకీ మనుష్యునికీ తేడా ఏమి ఉంటుంది ? మహాపురుషులపేర్లు మనం స్మరిస్తూ ఉన్నాం. ఎందుకు ? వారు తమ దేహాచింతవదలి యావత్తుప్రపంచానికి మేలుచేద్దామనే చింతలో మగ్నమైఉండేవారుగనుకనే మనంవారిపేర్లు స్మరిస్తూ ఉన్నాం. ప్రతిరోజూ సాయంకాలం నిద్రించేముందు "ఇవ్వాళ నేను నా శరీరంకోసం చాలాపనులు చేశాను. కాని ప్రపంచంకోసం ఏమిచేశాను?" అని ఆలోచించాలి. ఏ రోగికైనా సేవ

జేశానా? ఎక్కడీ మురికైనా శుభ్రంచేశానా? లేక ఏ దుఃఖితుని దుఃఖాన్నైనా తొలగించానా? సుఖం కలుగ జేశానా? ఎవరికైనా, ఏకొంచెమైనా, నాకు సాధ్యమైనంతలో సహాయం చేశానా? ఇలాంటి ప్రశ్నలు చిన్నపిల్లలు, వృద్ధులు, యువకులు, స్త్రీలు, పురుషులూ అందరూ తమకు తామే వేసుకోవాలి. రోజంతా కొంచెముకూడా పరోపకారం చేయకపోతే, ఆరోజు వృథాగా పోయినట్లే తలచుకోవాలి. కొంచెమో, గొప్పో సేవజేసి మరీ నిద్రించాలి.

మీరంతా మీజీవితాల్ని పరోపకారంలో లగ్నం చేయవలసిందని నాప్రార్థన. "అతడు చనిపోయాడు కాని మన కోసం అరిగిపోయినాడు" అని ప్రజలంతా అనుకునేటట్లు మీరంతా చేయాలి.

(ప్రార్థనసభ గోపురి పూజ్యజమనాలాల్ జీ (శ్రాద్ధదినం ది 11-12-1948)

## ౧౩

నా సోదర సోదరీమణులారా!!

ఒక పవిత్రమైన ఆత్మ, పరమాత్మలో లీనమైపోయింది. ఆదేహపు అంతిమ శేషంగూడా ఇప్పుడు సృష్టిలోకలిసి పోయింది.

దేహం "నశించవచ్చు, కాని ఆత్మ అవినాశి. దానికి మృత్యువు లేదు." ఇందుకు ప్రమాణం అనగా ఉదాహరణను మీ మనస్సులన్నీ ప్రత్యక్షంగా చూస్తూఉన్నాయి. గాంధీజీ హృదయంలో ఉండేభావాలు "దేహబంధనంవల్ల ఆభావాలు ఇప్పటివఱకు ఒకపరిమిత క్షేత్రంలో ఉండేవి" ఇప్పుడు మీ –

మా హృదయాలల్లో ప్రవేశించుతూ ఉన్నాయి. భవిష్యత్తులో వాటి ప్రకారం నడుచుకునేందుకు మనం ప్రయత్నింతాం.

"హిందువులు, ముస్లిములు, సిఖ్ఖులు, పారశీకులు, క్రైస్తవులు, యూదులు, మొదలగు వేరు వేరు మతావలంబులంతా మనసోదర సోదరీమణులే. ఇది మన మహాద్భాగ్యం. దానిని గుర్తించి మనం అన్నివిధములైన భేదభావాలు మరచి పోదాం. ప్రేమతో కలసిమెలసి ఉందాం. హరిజనులు,స్వజనులు ఈ చెడ్డభేదాన్ని అణచివేతాం. అంతా హరిజనులం అవుదాం. మనచేతులతో వడికిన నూలుబట్టలతో మనశరీరాల్ని కప్పుకుందాం. గ్రామాన్నంతా అద్దంలా, నిర్మలంగా ఉంచుదాం. అన్ని చెడువ్యసనాలు వదలివేతాం. సత్యాహింసవ్రతం అవలంబించుదాం." ఈ ప్రతిజ్ఞ పూరిగ నెరవేర్చేశక్తి పరమాత్ముడు మనకు ప్రసాదించుగాక — ఇదే మన ప్రార్థన.

(పరంధామ్,పవనార్‌ధాం నదియొక్క పంచధారలుకలిసిన ప్రవాహంలో పూజ్య గాంధీజీ అస్థికా నిమజ్జనం జరిగిన సందర్భంలో వెలువడిన ప్రవచనములు. సమయం రెండుజాములు. 12 గంటలు. ది 12-2-1948

## ౧౪

ఇవ్వాళ ధామ్ నది ఒడ్డున చూచిన దృశ్యం, నిజంగా పునర్జన్మ పొంది నప్పటి దృశ్యమే. నేను "ఈశావాస్య" అని ఉచ్చరించు చున్నపుడు నాలో కలిగిన అనుభూతి మాటల్లో వ్యక్తపరచడం చాలాకష్టం. అది మాటల్లో వ్యక్తీకరింపబడ

జాలదు. ఆత్మయొక్క వ్యాపకత్వాన్ని గూర్చి మనకు జ్ఞానులు నేర్పియే యున్నారు. శ్రద్ధకూడా ఇందుకు సహాయకారి అవుతుంది. కాని నేడుమాత్రం అందరికీ ఆ అనుభవం ఆ అనుభూతి కలిగింది. చివరకు నేను రెండు మూడు ప్రతిజ్ఞా వాక్యములు పలికితిని. అవి ఉపదేశ రూపములుకావు. సంకల్పరూపములు మాత్రమే. కాకాసాహబ్ అస్థి నిక్షేపం ఆ స్థానమునందు ఉంచి దానికి భక్తి భావంతో నమస్కరించాడు. అప్పుడు నానేత్రాలు ఆ కలశంమీద లేవు, కాని ఏభావంతో ఆ నమస్కారం పెట్టబడుతూ ఉందో, అటు నానేత్రాలు తిరిగి ఉన్నాయి. చాలా కాలాన్నుండీ కలిసి పనిచేసిన సోదరులమంతా అక్కడ ప్రోగయినాము. ఒక స్థూలశరీరపు శేషానికి విశ్రాంతి స్థలం ఏర్పాటు చేస్తూఉన్నాము. ఆ యావత్తుపనిలోను శోకానికి ఎక్కడా తావే లేదు. అంతటా గాంభీర్యం వ్యాపించిఉంది. మా సంకల్పాల్ని పూర్తిచేసుకొనేందుకు పరమాత్ముడు మాకు శక్తి ప్రసాదించవలసిందనే వినమ్రప్రార్థనఅందరిహృదయాలల్లో జరుగుతూఉంది. సమాప్తిఅయినతరువాత కొంతమంది పల్లెటూరిసోదరులతో వారిగ్రామంలో చేయవలసిన పనినిగురించి ఆలోచించేటందుకు కూర్చున్నాం. "ఇవ్వాళ మెరుపువలె మాలో ఏమో ప్రవేశించింది. ఇకపనిలో ఒక్కక్షణంకూడా ఆలస్యం జరగటానికి వీలు లేదు." అని కోటీబాబా అన్నాడు పరవశుడై గ్రామీణులంతా అతనితో ఏకీభవించారు. అనుమతికూడా ఇవ్వడం

ప్రారంభించారు. అక్కడే హాజరైఉన్న సేవకులం, మా జీవిత శుద్ధి ఉత్తరోత్తరా జరుపుకుంటూ ఆ గ్రామీణ సోదరులసేవలో తత్పరతతో మగ్నమైతే, వారివల్ల చాలా ఉత్తమసహాకారం మాకు దొరుకుతుం దనడంలో ఏమాత్రమూ సందేహంగాని, అనుమానంగాని, లేదు. ఇవ్వాళ ఈ ఒక్కభావమే మీ ఎదుట ఉంచుతూ ఉన్నాను. దీనినిగురించిన ఆలోచనలో లేక కార్య క్రమం ముందు ఏర్పాటుచేసుకోవచ్చును.

(ప్రార్థనసభ. గోపురి. నాల్ వాడి ది. 12-2-1948.

—:సంపూర్ణము:—

